శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
**శ్రీజగద్గురు శ్రీమత్ ఆదిశంకర భగవత్పాదులు**
ర చిం చి న

శ్రీ

# ప్రశ్నోత్తర రత్న మాలికా

శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీకాంచీ కామకోటి పీఠాధిపతి శ్రీజగద్గురు
**శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీమహాసన్నిధానము**
ద్రావిడభాషలో ఉపదేశించినది.

మదరాసు రాయపేట కేసరీ విద్యాలయమున ప్రధానోపాధ్యాయులైన
**విద్వాన్ కే. పీ. రాధాకృష్ణశాస్త్రులు**, బి.ఏ., బి.ఓ.ఎల్., ఎల్.టీ.
గారిచే ఆంధ్రీకరింపఁబడినది.

శ్రీ కామకోటి కోశస్థానము,
57, పశ్చిమ డబీర్ వీథి, కుంభకోణము

స్వభాను నామ సం॥

 1943. [వెల 0-2-6

श्रीः




श्रीमत् परमहंसपरिव्राजकाचार्यवर्य श्रीमच्छंकरभगवत्पादप्रतिष्ठित-
श्रीकाञ्ची कामकोटिपीठाधिप जगद्गुरु श्रीमच्चन्द्रशेखरेन्द्र-
सरस्वती श्रीपादैः क्रियते नारायणस्मृतिः ॥

**श्रीप्रश्नोत्तररत्नमालिका** नाम श्रीमदाचार्यभगवत्पादैरनुगृहीतः प्रवृत्तिनिवृत्तिमार्गद्वयसारात्मकः सरळमधुरपदयोजनारमणीयतया गीर्वाणभाषाभ्यासिनो बालानपि पाठयितुमर्हश्च अनुत्तमो ग्रन्थः श्रीकामकोटिकोशस्थानात् आन्ध्रभाषामयतात्पर्येण सह अचिरात् प्रकाशयिष्यमाणः सर्वेषामास्तिकानां पठनमननाद्युपयोगी सन् भूयसे श्रेयसे भूयादित्याशासहे॥

**मखाम्**
**भिक्षाण्डार् कोविल्**
**श्रीशा० शके १८६५**
**आश्विन कृ० १२ ॥**

**नारायणस्मृतिः ॥**

శ్రీః.

ముద్ర.

శ్రీమత్పరమహంస పరివ్రాజక ఆచార్యులైన శ్రీమత్ శంకర భగవత్ పాదులవలన ప్రతిష్ఠచేయబడిన శ్రీ కాంచీ కామకోటి పీఠాధీశ్వరులయిన శ్రీమత్ చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపాదులవలన నారాయణ స్మరణము చేయబడుచున్నది.

శ్రీ ప్రశ్నోత్తర రత్నమాలికా అని శ్రీమత్ ఆచార్య భగవత్ పాదులచే రచింపబడియు ప్రవృత్తి, నివృత్తి, అను రెండు మార్గముల సారముగ నుండునదియు, సులభమైన ఇంపైన పదములనుపయోగించి లలితముగ అమర్పబడియుండుటవలన, సంస్కృతభాషను అభ్యసించు చిన్నవారిని సయితము చదువజేయుటకు తగినదైన ప్రశస్తమైన గ్రంథము శ్రీకామకోటి కోశస్థానమునుండి ఆంధ్రభాషలో శీఘ్రకాలమున ప్రచురింపబడి సకల ఆస్తికులచేతను పఠించుటకును, మననముచేయుటకును మున్నగువానికి ఉపయోగమై ఎక్కువ శ్రేయస్సును ఒసంగుగాత యని ఆశీర్వదించుచున్నారము.

మఖామ్: భిక్షాండార్ కోవిల్
శ్రీ శాలివాహనశకే 1865
ఆశ్విన కృ. 12.

నారాయణస్మృతిః.

శ్రీమదాదిశంకరభగవత్పాదకృతా

# ప్రశ్నోత్తర - రత్నమాలికా.



శ్లో॥ కః ఖలు నాలంక్రియతే, దృష్టాదృష్టార్థసాధనపటీయాన్।
అముయా కంఠస్థితయా ప్రశ్నోత్తరరత్నమాలికయా॥ 1

ఇహ పర శ్రేయస్సును పొందు సామర్థ్యముగల ఎవడు ఈ ప్రశ్నోత్తర రత్నమాలికను మనస్సున ధ్యానించి దీనిచే అలంకరింపబడలేదు.

శ్లో॥ భగవన్ కిముపాదేయం? గురువచనం, హేయమపి
చ కిమ్? అకార్యమ్। కో గురుః? అధిగతతత్త్వః శిష్య
హితాయోద్యతః సతతమ్॥ 2

ప్రశ్న :—స్వామీ, గ్రహింపవలసినది ఏది?

ఉత్తరము :—గురువచనము.

ప్ర :—త్రోసివేయవలసినది ఏది?

ఉ :—అకార్యము.

ప్ర :—గురువు ఎవరు?

ఉ :—సత్యమును ఎఱిగినవారు. తన్ను చేరిన శిష్యులయొక్క క్షేమము కొఱకు ఎడతెగక పాటుపడువారు.

శ్లో॥ త్వరితం కిం కర్తవ్యం విదుషాం? సంసారసంతతిచ్ఛేదః।
కిం మోక్షతరోర్బీజం? సమ్యగ్జ్ఞానం క్రియాసిద్ధమ్॥ 3

ప్ర :—వివేకము గలవాడు త్వరగా చేయవలసినది ఎయ్యది ?

ఉ :—సంసార పరంపరను కత్తరించుట (చనిపోయి, చనిపోయి పుట్టక మోక్షమును పొందుట)

ప్ర :—మోక్ష వృక్షమునకు బీజము ఏది ?

ఉ :—ఉన్నదానిని ఉన్నట్లు తెలిసికొని కార్యములో చూపుట.

శ్లో॥ కః పథ్యతరో ? ధర్మః, కః శుచిరిహ ? యస్య మానసం శుద్ధమ్। కః పండితో ? వివేకీ, కిం విషమ్ ? అవధీరణా గురుషు॥ 4

ప్ర :—ఏది పథ్యము (హితమైనది) ?

ఉ :—ధర్మము.

ప్ర :—ఎవడు శుద్ధమైనవాడు ?

ఉ :—ఎవని మనస్సు శుద్ధముగానున్నదో ఆతడు.

ప్ర :—ఎవడు పండితుడు ?

ఉ :—వివేకి (వివేకము గలవాడు)

ప్ర :—ఏది విషము ?

ఉ :—పెద్దల మాటలను అలక్ష్యము చేయుట.

శ్లో॥ కిం సంసారేసారం? బహుశోఽపివిచింత్యమానమిదమేవ। కిం మనుజేష్విష్టతమం? స్వపరహితాయోద్యతంజన్మ॥ 5

ప్ర :—సంసారములో సారమేది ?

ఉ :—పలుమారు దీనిని స్మరించుచుండుటయే. (సంసారములో సారము ఎయ్యది అని స్మరించుచునే ఉండుటవలన పాశమును విడిచి జననమును ఛేదింపవచ్చును)

ప్ర :—మనుజులు కోరదగినది ఏది ?

ఉ :—తాను, ఇతరులు—వీరి క్షేమమునకుగాను పాటుపడు జన్మము.

శ్లో॥ మదిరేవ మోహజనకః కః? స్నేహః, కే చ దస్యవో? విషయాః।
కా భవవల్లీ? తృష్ణా, కో వైరీ? యస్త్వనుద్యోగః॥ 6

ప్ర :—కల్లువలె మత్తు కలుగజేయునది ఏది?

ఉ :—పాశము. (ఆశ, స్నేహము)

ప్ర :—తస్కరులు ఎవరు?

ఉ :—ఇంద్రియములను లాగికొనుపోవు విషయములే.

ప్ర :—సంసార లత ఏది?

ఉ :—ఆశయే.

ప్ర :—శత్రువు ఎవడు?

ఉ :—సోమరితనమే.

శ్లో॥ కస్మాద్భయమిహ? మరణాత్, అంధాదిహ కో విశిష్యతే? రాగీ। కః శూరో? యో లలనాలోచనబాణైర్న చ వ్యథితః॥ 7

ప్ర :—ఎల్లవారును భయముపొందునది దేనికి?

ఉ :—మరణమునకు.

ప్ర :—గ్రుడ్డివానికంటె గ్రుడ్డివాడు ఎవడు?

ఉ :—ఆశగలవాడు.

ప్ర :—శూరుడెవడు?

ఉ :—దుర్మార్గమున మనస్సును పోనీక దానిని అణచు నాతడు. (స్త్రీలయొక్క చూపులను బాణములచేత కొట్టబడనివాడు)

శ్లో॥ పాతుం కర్ణాంజలిభిః కిమమృతమిహ యుజ్యతే? సదుపదేశః। కిం గురుతాయా మూలం? యదేతదప్రార్థనం నామ॥ 8

ప్ర :—చెవి యను అంజలిచేత భుజింపదగిన అమృత మెయ్యది ?

ఉ :—సాధువుల ఉపదేశము. (రెండు చేతులను చేర్చి మోడ్చుట, అంజలియనబడును. చెవి మోడ్చినట్లుండుటవలన అంజలి యని చెప్పబడియున్నది.)

ప్ర :—మహిమకు (లేక గొప్పతనమునకు) మూలము ఏది ?

ఉ :—ఒకరియొద్ద ఏమియును యాచింపకుండుట.

శ్లో॥ కిం గహనం ? స్త్రీచరితం, కశ్చతురో ? యో న ఖండిత
స్తేన। కిం దుఃఖమ్ ? అసంతోషః, కిం లాఘవమ్ ? అధ
మతో యాచ్ఞా ॥ 9

ప్ర :—కొలుచుటకు వీలులేనిది ఏది ?

ఉ :—స్త్రీల చరితము.

ప్ర :—సమర్థుడెవడు ?

ఉ :—స్త్రీల చేష్టలచే వంచింపబడనివాడు.

ప్ర :—దుఃఖము అనునది ఏది?

ఉ :—తృప్తిలేకుండుట.

ప్ర :—ఏది చులకన?

ఉ :—అధముని యాచించుట.

శ్లో॥ కిం జీవితమ్ ? అనవద్యం, కిం జాడ్యం, పాఠతోఽప్య
నభ్యాసః। కో జాగర్తి? వివేకీ, కా నిద్రా? మూఢతా
జంతోః॥ 10

ప్ర :—శ్లాఘ్యమైన జీవనంబేది ?

ఉ :—దోషము లేమి.

ప్ర :—తెలివిలేమి అన నేమి ?

ఉ :—పాఠమునందును అభ్యాసము లేకుండుట.

ప్ర :—మేలుకొనియుండువా డెవడు ?

ఉ :—వివేకము గలవాడు.

ప్ర :—నిద్ర అనగా నేమి ?

ఉ :—జంతువుల మూఢత్వము.

శ్లో॥ నళినీదళగతజలవత్తరళం కిం? యౌవనం ధనం చాయుః।
కథయ పునః కే శశినః కిరణసమాః? సజ్జనా ఏవ॥ 11

ప్ర :—తామరపాకుమీది నీటివలె చంచలమైనది. (శాశ్వతము కానిది) ఏవి ?

ఉ :—జవ్వనము, సంపత్తు, ఆయువును.

ప్ర :—చంద్రకిరణమువంటివారు (ఇతరులకు హితము చేయువారు) ఎవరు ?

ఉ :—సత్పురుషులే.

శ్లో॥ కో నరకః? పరవశతా, కిం సౌఖ్యం? సర్వసంగవిరతిర్యా।
కిం సత్యం ? భూతహితం, ప్రియం చ కిం ప్రాణినామ్ ?
అసవః ॥ 12

ప్ర :—నరకము ఏది ?

ఉ :—ఇతరులకు వశమైయుండుట.

ప్ర :—సౌఖ్యము అననేమి ?

ఉ :—సర్వసంగ పరిత్యాగము.

ప్ర :—సత్యము ఏది ?

ఉ :—జీవులకు హితమైనది.

ప్ర :—ప్రాణులకు ప్రియమైనది ఏది ?

ఉ :—ప్రాణము.

శ్లో॥ కోఽనర్థఫలో? మానః, కా సుఖదా? సాధుజనమైత్రీ।
సర్వవ్యసనవినాశే కో దక్షః? సర్వదా త్యాగీ॥ 13

ప్ర :—ఎది అనర్థమును కలుగజేయును ?

ఉ :—అహంభావము.

ప్ర :—ఎయ్యది సుఖంబు నిచ్చును ?

ఉ :—సత్సంగము అనగా మంచి మనస్సు గలవారితోడి చెలిమి.

ప్ర :—సకల దుఃఖములను తొలగించుటయందు ఎవడు సమర్థుడు ?

ఉ :—ఏదియు, తనకు వలదని యుండువాడు.

శ్లో॥ కిం మరణం? మూర్ఖత్వం, కిం చానర్ఘం యదవసరే
దత్తమ్। ఆమరణాత్ కిం శల్యం? ప్రచ్ఛన్నం యత్కృ
తం పాపమ్॥ 14

ప్ర :—మరణముకంటె ఏది గొప్పది ?

ఉ :—మూర్ఖగుణము.

ప్ర :—వెలలేనిది ఏది ?

ఉ :—తగిన సమయమున ఇచ్చినది.

ప్ర :—చనిపోవువఱకు పొడుచునది ఏది ?

ఉ :—రహస్యముగా ఒనరించిన పాపము.

శ్లో॥ కుత్రవిధేయో యత్నో? విద్యాభ్యాసే సదౌషధే దానే।
అవధీరణా క్వ కార్యా? ఖల పరయోషిత్ పరధనేషు॥15

ప్ర :—దేనికొఱకై ప్రయత్నముచేయవలయును ?

ఉ :—విద్యాభ్యాసము, మంచి ఔషధము, దానముచేయుట—వీని కొఱకు.

ప్ర :—అలక్ష్యము చేయవలసినవి ఏవి ?

ఉ :—దుష్టులు, ఇతరుల భార్య, ఇతరుల వస్తువులు అనునవి.

శ్లో॥ కాఽహర్నిశమనుచింత్యా ? సంసారాసారతా న తు
ప్రమదా ।
కా ప్రేయసీ విధేయా? కరుణా దీనేషు సజ్జనే మైత్రీ॥ 16

ప్ర :—రేయిం బవలు స్మరింపవలసినది ఏది ?
ఉ :—సంసారములో సారము లేదు అనుట; స్త్రీ కాదు.
ప్ర :—ప్రియముగా చేయవలసినది ఏది ?
ఉ :—దీనులయెడల కరుణయు, సాధువులయెడల స్నేహమును.

శ్లో॥ కంఠగతైరప్యసుభిః కస్య హ్యాత్మా న శక్యతే జేతుమ్।
మూర్ఖస్య శంకితస్య చ విషాదినో వా కృతఘ్నస్య॥ 17

ప్ర :—ప్రాణము పోవునంతటిస్థితి వచ్చినను ఎవని ఆత్మను మంచి మార్గమున త్రిప్పుటకు వీలుపడదు ?
ఉ :—మూర్ఖులు, శాశ్వతమైన సందేహము గలవారు, ఏడ్పుమూతి వారు, కృతఘ్నులు (చేసిన మేలును మఱచెడివారు)

శ్లో॥ కః సాధుః ? సద్వృత్తః, కమధమమాచక్షతే ? త్వసద్వృత్తమ్। కేన జితం జగదేతత్ ? సత్య తితిక్షావతా పుంసా ॥ 18

ప్ర :—సాధువు ఎవడు ?
ఉ :—మంచి నడవడి గలవాడు.
ప్ర :—ఎవడు అధముడు ?
ఉ :—దుష్ప్రవర్తనము గలవాడు.
ప్ర :—జగత్తును, ఎవడు జయింపగల్గును?
ఉ :—సత్యమును, శాంతమును గలవాడు.

శ్లో॥ కస్మై నమాంసి దేవాః కుర్వన్తి? దయాప్రధానాయ।
కస్మాదుద్వేగః స్యాత్ ? సంసారారణ్యతః సుధియః॥19

ప్ర :—ఎవనిని దేవతలుకూడ నమస్కరించెదరు ?

ఉ :—దయను ముఖ్యముగ గలవానిని.

ప్ర :—దేనిని చూచి భయము నొందవలయును ?

ఉ :—సంసారమను అడవిని చూచి మంచి వివేకముగలవారు భయపడవలయును.

శ్లో॥ కస్య వశే ప్రాణిగణః ? సత్యప్రియభాషిణో వినీతస్య।
క్వ స్థాతవ్యం? న్యాయ్యే పథి దృష్టాదృష్టలాభాఢ్యే॥ 20

ప్ర :—జీవరాసులు ఎవనికి వశమగును ?

ఉ :—సత్యమును, ప్రియమైన వచనమును, అడకువయును ఎవనియొద్దనున్నవో అతనికి.

ప్ర :—ఎచ్చోట నిలువవలయును ?

ఉ :—చూడబడినట్టియు, చూడబడనట్టియు ఇహపరలాభములు నిండిన న్యాయ మార్గమున.

శ్లో॥ కోఽన్ధో? యోఽకార్యరతః, కో బధిరో? యో హితాని న శృణోతి।
కో మూకో? యః కాలే ప్రియాణి వక్తుం న జానాతి॥ 21

ప్ర :—గ్రుడ్డివాడు ఎవడు ?

ఉ :—చదివియుండియు, చెడ్డపనులను చేయువాడు.

ప్ర :—చెవిటివాడు ఎవడు ?

ఉ :—హితమును విననివాడు.

ప్ర :—మూగవాడెవడు ?

ఉ :—ఇంపైన మాటలను సరియైన కాలమున చెప్ప నేర్వనివాడు.

శ్లో॥ కిం దానమ్ ? అనాకాఙ్క్షం, కిం మిత్రం ? యో నివార
యతి పాపాత్। కోఽలంకారః ? శీలం, కిం వాచాం
మండనం ? సత్యమ్॥ 22

ప్ర :—దానము అన నేమి ?

ఉ :—అడుగకయే ఇచ్చుట.

ప్ర :—స్నేహితు డెవడు ?

ఉ :—పాపము చేయుటను అడ్డగించువాడు.

ప్ర :—అందము అన నేమి ?

ఉ :—శీలము.

ప్ర :—వాగ్భూషణం బెయ్యది ?

ఉ :—సత్యము.

శ్లో॥ విద్యుద్విలసితచపలం కిం ? దుర్జనసంగతిర్యువతయశ్చ।
కులశీలనిష్ప్రకంపాః కే కలికాలేఽపి ? సజ్జనా ఏవ ॥ 23

ప్ర :—మెఱుపుయొక్క కాంతివలె చంచలమైనవి ఏవి ?

ఉ :—దుర్జనుల కూడికయు, స్త్రీలును.

ప్ర :—కలికాలములోను కులశీలములనుండి చలింపనివారు ఎవరు ?

ఉ :—సత్పురుషులే.

శ్లో॥ చింతామణిరివ దుర్లభమిహ కిం ? కథయామి తచ్చతు
ర్భద్రమ్। కిం తద్వదంతి భూయో విధూతతమసో
విశేషణ ॥ 24

శ్లో॥ దానం ప్రియవాక్సహితం, జ్ఞానమగర్వం, క్షమాన్వితం
శౌర్యమ్। విత్తం త్యాగసమేతం, దుర్లభమేతత్ చతు
ర్భద్రమ్ ॥ 25

ప్ర :—చింతామణివలె దుర్లభమైనది ఏది? (పొందుటకు సాధ్యము కానిది.)

ఉ :—చతుర్భద్రం (భద్రముగ నుండుట. భద్రము అనగా శుభము.)

ప్ర :—ఆ చతుర్భద్రము ఏది యని జ్ఞానులు చెప్పుచున్నారు?

ఉ :—ప్రియవాక్కుతో కూడిన దానము, గర్వములేని జ్ఞానము, క్షమతో కూడిన శౌర్యము, త్యాగముతో కూడిన సంపద.

శ్లో॥ కిం శోచ్యం? కార్పణ్యం, సతి విభవే కిం ప్రశస్తమ్? ఔదార్యమ్। కః పూజ్యో విద్వద్భిః? స్వభావతః సర్వదా వినీతో యః॥ 26

ప్ర :—పరితాపము చెందదగినది ఏది?

ఉ :—కార్పణ్యము. (తనకు లేకయు, ఇతరులకును లేకయు, ఇహమునకు లేకయు, పరమునకు లేకయు, విశేషముగా నుంచుకొనుట.)

ప్ర :—సౌకర్యముండినచో ఏది ప్రశస్తమైనది? (పొగడబడునది.)

ఉ :—ఔదార్యము.

ప్ర :—వివేకము గలవారు ఎవరిని పూజింతురు?

ఉ :—స్వాభావికముగా ఎల్లప్పుడును వినయము గలవారిని. (ఒక కార్యమును ఉద్దేశించి, వినయముతో కూడియుండుట స్వాభావికమైన వినయము కాదు.)

N. B. [కార్యమును ఉద్దేశించి వినయముతో నుండువాడు ఏతపుత్రానికి సమానమైనవాడు అని ఒక శ్లోకమున్నది. బాన (ఏతపుకడవ) నిండిన వెంటనే ఏతపుత్రాని తల ఆకాశమున నుండును. బానలోని నీరు పోయబడిన వెనుక అది మిక్కిలి నమ్రత కలిగియుండును. ఆలాగుననే కార్యమును ఉద్దేశించి వినయముతో వర్తించువాడు జీవనోపాయము లేని సమయమున లొంగియుండును. జీవనము దొరకినపక్షమున గర్వించి విజృంభించును.]

శ్లో॥ కః కులకమల దినేశః ? సతి గుణవిభవేఽపి యో నమ్రః।
కస్య వశే జగదేతత్ ? ప్రియహితవచనస్య ధర్మ
నిరతస్య ॥ 27

ప్ర :—మనము జన్మించిన కులము అను తామర ఏ సూర్యుని చూచిన యెడల ఆనందముతో ప్రకాశించును ?

ఉ :—గుణములు పరిపూర్ణముగ నుండియు, పరిపూర్ణమైన వినయముతో నుండువానిని చూచినయెడల కులము లేక వంశము అను తామర ప్రకాశించును.

ప్ర :—ఈ ప్రపంచము ఎవనికి వశమగును ?

ఉ :—ప్రియముగ మాటలాడుటకు నేర్చుకొని, ధర్మమును అనుష్ఠించు వానికి ప్రపంచము లోబడును (వశమగును.) [జగత్తును వశ్యము గావించుకొనుటకుగాను వినయమును చేకొనరాదు. వినయముతో నుండినయెడల జగత్తు తానే అతనికి లోబడును.]

శ్లో విద్వన్మనోహరా కా ? సత్కవితా బోధవనితా చ।
కం న స్పృశతి విపత్తిః ? ప్రవృద్ధవచనానువర్తినం
దాంతమ్ ॥ 28

ప్ర :—విద్వాంసుల మనస్సును హరించునది ఏది ?

ఉ :—మంచి కవిత్వమును బుద్ధి అను స్త్రీయు.

ప్ర :—విపత్తు ఎవనిని సమీపింపదు ?

ఉ :—పెద్దల ఉపదేశమును అనుసరించి నడచువానిని, అణకువ గల వానిని.

శ్లో॥ కస్మై స్పృహయతి కమలా ? త్వనలసచిత్తాయ నీతి
వృత్తాయ। త్యజతి చ కం సహసా ? ద్విజగురుసుర
నిందాకరం చ సాలస్యమ్ ॥ 29

ప్ర :—లక్ష్మి ఎవనిని అభిలషించును ?
ఉ :—చులుకైన చిత్తముగలవానిని, నీతి తప్పని నడత గలవానిని.
ప్ర :—ఎవనిని విడిచి లక్ష్మి వెళ్లిపోవును ?
ఉ :—బ్రాహ్మణుని, గురువును, దేవతలను నిందించుచు సోమరితనము గల వానిని.

శ్లో॥ కుత్ర విధేయో వాసః ? సజ్జననికటేఽథవా కాశ్యామ్ ।
కః పరిహార్యో దేశః ? పిశునయుతో లుబ్ధభూపశ్చ॥ 30

ప్ర :—వాసము చేయవలసినది ఎచ్చట ?
ఉ :—మంచివారి సమీపమున, లేక కాశీక్షేత్రములో.
ప్ర :—మనము ఏదేశమునుండి వెడలిపోవలయును ?
ఉ :—నీచులుగల దేశమునుండియు, లోభగుణము గల రాజు దేశము నుండియు.

శ్లో॥ కేనాశోచ్యః పురుషః ? ప్రణతకళత్రేణ ధీరవిభవేన ।
ఇహ భువనే కః శోచ్యః ? సత్యపి విభవే న యో దాతా ॥ 31

ప్ర :—దేనిచే మనుష్యుడు దుఃఖము లేనివాడుగ నుండును ?
ఉ :—వినయము గల భార్యవలనను, నిలుకడగల ఐశ్వర్యమువలనను.
ప్ర :—ఈ ప్రపంచమున శోచింపదగినవా డెవడు ?
ఉ :—ధనముండియు ఇతరుల కొసంగనివాడు.

శ్లో॥ కిం లఘుతాయా మూలం ? ప్రాకృతపురుషేషు యా యాచ్ఞా ।
రామాదపి కః శూరః? స్మరశరనిహతో న యశ్చలతి॥ 32

ప్ర :—చులకనకు కారణమేది ?

ఉ :—నీచులైనవారియెడల యాచించుట.

ప్ర :—శ్రీరామునికన్న శూరుడెవడు ?

ఉ :—మన్మథుని బాణములచేత కొట్టబడినను చలింపని మనస్సు గలవాడు.

శ్లో॥ కిమహర్నిశమనుచింత్యం? భగవచ్చరణం న సంసారః। చక్షుష్మంతోఽప్యంధాః కే స్యుః? యే నాస్తికా మనుజాః ॥ 33

ప్ర :—రేయుం బవలు చింతింపదగినది ఏది ?

ఉ :—ఈశ్వరుని పాదారవిందములే; సంసారము కాదు.

ప్ర :—కన్నులుండియు గ్రుడ్డివారు ఎవరు ?

ఉ :—నాస్తికులైన మనుజులు.

శ్లో॥ కః పంగురిహ ప్రథితః? వ్రజతి చ యో వార్ధకే తీర్థమ్। కిం తీర్థమపి చ ముఖ్యం? చిత్తమలం యన్నివర్తయతి॥34

ప్ర :—కుంటివాడెవడు ?

ఉ :—ముదిరిన వయస్సునందు తీర్థయాత్ర బోవునతడు.

ప్ర :—ముఖ్యమైన తీర్థము ఏది ?

ఉ :—చిత్తములోని మురికిని ఏది పోగొట్టుచున్నదో అదియే.

శ్లో॥ కిం స్మర్తవ్యం పురుషైః? హరినామ సదా, న యావనీ భాషా। కో హి న వాచ్యః సుధియా? పరదోషశ్చానృతం తద్వత్ ॥ 35

ప్ర :—మనుజులు స్మరింపదగినది ఏది?

ఉ :—ఎల్లప్పుడును హరినామమే. మ్లేచ్ఛభాష కాదు.

ప్ర :—మంచిబుద్ధి గలవానిచే చెప్పతగనిది ఏది ?
ఉ :—ఇతరుల దోషమును, అసత్యమును.

శ్లో॥ కిం సంపాద్యం మనుజైః ? విద్యా విత్తం బలం యశః పుణ్యమ్ । కః సర్వగుణవినాశీ ? లోభః, శత్రుశ్చ కః ? కామః ॥ 36

ప్ర :—మనుజులచే సంపాదింపదగినది ఏది ?
ఉ :—విద్య, సంపద, బలము, యశస్సు, పుణ్యము ఇవి.
ప్ర :—సకల గుణములను నాశము చేయునది ఏది ?
ఉ :—లోభము.
ప్ర :—ఎవడు శత్రువు ?
ఉ :—కామము.

శ్లో॥ కా చ సభా పరిహార్యా ? హీనా యా వృద్ధసచివేన । ఇహ కుత్రావహితః స్యాన్మనుజః కిల ? రాజసేవాయామ్ ॥ 37

ప్ర :—ఏ సభను బహిష్కరింపవలయును ?
ఉ :—ముదిమి వయస్సుననుండు మంత్రి లేని సభను.
ప్ర :—ఈ ప్రపంచమున మనుష్యుడు ఏవిషయమందు జాగ్రత్తగ నుండవలయును ?
ఉ :—రాజసేవ చేయుటయందు.

శ్లో॥ ప్రాణాదపి కో రమ్యః ? కులధర్మః సాధుసంఘశ్చ ।
కా సంరక్ష్యా ? కీర్తిః పతివ్రతా నైజబుద్ధిశ్చ ॥ 38

ప్ర :—ప్రాణమునకంటె ప్రియమైనవి ఏవి ?
ఉ :—కులధర్మమును సాధువుల సంసర్గమును.

ప్ర :—రక్షింపదగినవి ఏవి ?

ఉ :—కీర్తియు, పాతివ్రత్యము గలస్త్రీయు, స్వబుద్ధియును.

శ్లో॥ కా కల్పలతా లోకే ? సచ్ఛిష్యాయార్పితా విద్యా ।
కోఽక్షయవటవృక్షః స్యాత్ ? విధివత్ సత్పాత్ర
దత్తదానం యత్ ॥ 39

ప్ర :—లోకములో కల్పవృక్షమువలె నుండునది ఏది ?

ఉ :—సచ్ఛిష్యునకు అర్పణము చేయబడిన విద్య.

ప్ర :—అక్షయ వటమువంటిది ఏది ?

ఉ :—విధిప్రకారము సత్పాత్రమునకు ఒసంగబడిన దానము.

శ్లో॥ కిం శస్త్రం సర్వేషాం? యుక్తిః, మాతా చ కా? ధేనుః।
కిం ను బలం ? యద్ధైర్యం, కో మృత్యుః ? యదవధాన
రహితత్వమ్ ॥ 40

ప్ర :—ఏ ఆయుధము అందఱి చేతిలోను గలదు ?

ఉ :—యుక్తి. (న్యాయపూర్వకముగ నిరూపణము చేయగల శక్తి).

ప్ర :—అందఱకును జనని ఏది ?

ఉ :—గోవు. (తన బిడ్డకు పాలిచ్చి ఇతరులకు పాలిచ్చి పోషించు తల్లి. దానిని మనము సంరక్షింపవలయును.)

ప్ర :—ఏది సైన్యము ?

ఉ :—ధైర్యము.

ప్ర :—ఏది యముడు ?

ఉ :—శ్రద్ధతో వినకుండుట.

శ్లో॥ కుత్ర విషం? దుష్టజనే, కిమిహాశౌచం భవేత్?
ఋణం నృణామ్। కిమభయమిహ? వైరాగ్యం, భయ
మపి కిం? విత్తమేవ సర్వేషామ్ ॥ 41

ప్ర :—విష మెచ్చట నున్నది?
ఉ :—దుష్టజనులయొద్ద నున్నది.
ప్ర :—మైల ఏది?
ఉ :—ఋణమేగాని మఱియొకటి కాదు. (అప్పిచ్చినవానికి జనులు దాగుకొనునట్లు వేరు ఎవరికిని దాగియుండరు. మైలగానున్నప్పుడు దేవాలయమునకు వెళ్లరాదు. సభకు వెళ్లగూడదు. అప్పు చేసినవాడును అలాగే వెళ్లడు.)
ప్ర :—అభయము ఏది? (భయము పొందుటకు అవకాశము లేని స్థితి.)
ఉ :—వైరాగ్యము. (ఆశను వదలిపెట్టినచో అదియే అభయము.)
ప్ర :—ఏది భయము?
ఉ :—ధనము.

శ్లో॥ కా దుర్లభా నరాణాం? హరిభక్తిః, పాతకం చ కిం?
హింసా। కో హి భగవత్ప్రియః స్యాత్? యోఽన్యం
నోద్వేజయేదనుద్విగ్నః ॥ 42

ప్ర :—నరులకు దుర్లభమైనది ఏది? (పొందుటకు అశక్యమైనది)
ఉ :—హరిభక్తి.
ప్ర:—ఏది పాతకము?
ఉ :—హింసించుట.
ప్ర :—భగవంతునికి ఎవరియొద్ద ఎక్కువ ప్రీతి?
ఉ :—తాను మనస్సునందు సంకటము నొందక ఇతరులకు సంకటము లేక ఆపద తలంపనివానియొద్ద, భగవంతునికి ఎక్కువ ప్రీతి.

శ్లో॥ కస్మాత్సిద్ధిః ? తపసః, బుద్ధిః క్వ ను ? భూసురే, కుతో
బుద్ధిః ? వృద్ధోపసేవయా, కే వృద్ధాః ? యే ధర్మ
తత్త్వజ్ఞాః ॥ 43

ప్ర :—దేనివలన కార్యసిద్ధి కలుగుచున్నది ?

ఉ :—తపస్సువలన (ఏకాగ్రచిత్తుడై ఒకేపనియందు నిమగ్నుడై యుండుట.)

ప్ర :—బుద్ధి యెవరియొద్ద నున్నది ?

ఉ :—బ్రాహ్మణునియొద్ద.

ప్ర :—వాస్తవమైన బుద్ధి ఏది ?

ఉ :—పెద్దలను చేరి, వారికి శుశ్రూష జేసి, దానివలన మనకు కలుగు బుద్ధి.

ప్ర :—పెద్దలు ఎవరు ?

ఉ :—ధర్మతత్వమును బాగుగ నెఱిగినవారు. (వారు వయస్సుచే పసివారుగ నుండినను జ్ఞానముచేత గొప్పవారే.)

శ్లో॥ సంభావితస్య మరణాదధికం కిం ? దుర్యశో భవతి ।
లోకే సుఖీ భవేత్కో ? ధనవాన్, ధనమపి చ కిం ?
యతశ్చేష్టమ్ ॥ 44

ప్ర :—ప్రసిద్ధినొందిన వానికి మరణమునకంటె ఏది పెద్దది ?

ఉ :—అపకీర్తి.

ప్ర :—లోకమున ఎవ్వడు సుఖి ?

ఉ :—ధనవంతుడు.

ప్ర :—సంపద అనునది ఏది ?

ఉ :—దేనివలన ఇష్టసిద్ధి కలుగునో, అదియే సంపద.

శ్లో॥ సర్వసుఖానాం బీజం కిం ? పుణ్యం, దుఃఖమపి కుతః ?
పాపాత్ ।
కస్యైశ్వర్యం ? యః కిల శంకరమారాధయేత్
భక్త్యా ॥ 45

ప్ర :—సకల సుఖంబులకును మూలంబేది ?

ఉ :—పుణ్యము.

ప్ర :—దుఃఖంబునకు మూలం బెయ్యది ?

ఉ :—పాపము.

ప్ర :—ఐశ్వర్యము ఎవరికి అబ్బును ?

ఉ :—ఎవ్వడు ఈశ్వరుని భక్తితో నారాధించునో అతనికి.

శ్లో॥ కో వర్ధతే ? వినీతః, కో వా హీయేత, యో దృప్తః ।
కో న ప్రత్యేతవ్యో ? బ్రూతే యశ్చానృతం శశ్వత్ ॥46

ప్ర :—ఎతడు అభ్యుదయము నొందును ?

ఉ :—వినయము గలవాడు.

ప్ర :—ఎవ్వడు నష్టము పొందును ?

ఉ :—గర్వము గలవాడు.

ప్ర :—ఎవని విశ్వసింపరాదు ?

ఉ :—ఎల్లప్పుడును అనృతమాడువానిని.

శ్లో॥ కుత్రానృతేఽప్యపాపం ? యచ్చోక్తం ధర్మరక్షా
ర్థమ్ । కో ధర్మో ? అభిమతో యః శిష్టానాం నిజకులీ
నానామ్ ॥ 47

ప్ర :—అనృతమాడుట ఎప్పుడు పాపముకాదు ?

ఉ :—ధర్మమును రక్షించుటకుగాను చెప్పబడిన అసత్యము పాపము
కాదు.

ప్ర :—ఏది ధర్మము ?

ఉ :—మన వంశమందు జన్మించిన పెద్దలలో, అనుష్ఠానము గలవారు అనుష్ఠించిన ధర్మమే మనకు ధర్మము.

శ్లో॥ సాధుబలం కిం ? దైవం, కః సాధుః ? సర్వదా తుష్టః।
దైవం కిం ? యత్ సుకృతం, కః సుకృతీ ? శ్లాఘ్యతే
చ యః సద్భిః ॥ 48

ప్ర :—సాధువునకు ఎవరు బలము ?

ఉ :—దైవము.

ప్ర :—ఎవ్వడు సాధువు ?

ఉ :—ఎల్లప్పుడును సంతుష్టి గలిగియుండు నాతడు; శోచింపనివాడు.

ప్ర :—దైవము అనునది ఏమి ?

ఉ :—నీవు ఒనరించిన సత్కార్యమే.

ప్ర :—సుకృతి ఎవడు ?

ఉ :—సత్పురుషులచే శ్లాఘింపబడు నాతడు.

శ్లో॥ గృహమేధినశ్చ మిత్రం కిం ? భార్యా, కో గృహీ చ ? యో యజతే।
కో యజ్ఞో ? యః శ్రుత్యా విహితః శ్రేయస్కరో నృణామ్ ॥ 49

ప్ర :—గృహస్థాశ్రమమున మిత్రు డెవరు ?

ఉ :—భార్య.

ప్ర :—గృహస్థు డెవడు ?

ఉ :—యజ్ఞములను చేయువాడు.

ప్ర :—యజ్ఞమనునది ఏది ?

ఉ :—అవశ్యము అనుష్ఠింపవలయును, అని వేదములందు ఎది విధింపబడి మనకు శ్రేయస్సు నిచ్చుచున్నదో, అది.

శ్లో॥ కస్య క్రియా హి సఫలా ? యః పునరాచారవాన్
శిష్టః। కః శిష్టో ? యో వేదప్రమాణవాన్, కో హతః?
క్రియాభ్రష్టః ॥ 50

ప్ర :—కర్మానుష్ఠానములు ఎవ్వనికి ఫలము నొసంగును ?
ఉ :—ఆచారముకలిగి, శిష్టుడైనవానికి.
ప్ర :—ఎవ్వాడు శిష్టుడు ?
ఉ :—వేదమును ప్రమాణముగ నమ్మినవాడు.
ప్ర :—ఎవడు బ్రదికియుండియు, చనిపోయిన వాడు ?
ఉ :—కర్మములను చేయనివాడు.

శ్లో॥ కో ధన్యః ? సంన్యాసీ, కో మాన్యః ? పండితః సాధుః।
కః సేవ్యో ? యో దాతా, కో దాతా ? యోఽర్థి
తృప్తిమాతనుతే ॥ 51

ప్ర :—ఎవడు ధన్యుడు ?
ఉ :—సన్యాసి.
ప్ర :—ఎవడు పూజింపబడువాడు ?
ఉ :—విద్యల నభ్యసించి సాధువుగ ప్రవర్తించువాడు.
ప్ర :—ఎవని సేవింపవలయును ?
ఉ :—దాతను.
ప్ర :—దాత ఎవడు ?
ఉ :—యాచించువానిని తృప్తి చేయునాతడు.

శ్లో॥ కిం భాగ్యం దేహవతామ్ ? ఆరోగ్యం, కః ఫలీ ?
కృషికృత్ ।
కస్య న పాపం? జపతః, కః పూర్ణో? యః ప్రజావాన్
స్యాత్ ॥ 52

ప్ర :—శరీరధారులకు పెద్దభాగ్య మెద్ది ?

ఉ :—ఆరోగ్యము.

ప్ర :—ఫలము ఎవనికి కల్గును ?

ఉ :—ప్రయత్నము చేయువానికి.

ప్ర :—పాపము ఎవనిని సమీపింపదు ?

ఉ :—ఎల్లప్పుడును జపము చేయువానిని.

ప్ర :—సంపూర్ణుడైనవా డెవడు ?

ఉ :—సత్పుత్త్రులను కన్నవాడు.

శ్లో॥ కిం దుష్కరం నరాణాం, ? యన్మనసో నిగ్రహః సతతమ్।
కో బ్రహ్మచర్యవాన్ స్యాత్ ? యశ్చాస్ఖలితోర్ధ్వ
రేతస్కః ॥ 53

ప్ర :—చేయుటకు కష్టమైనది ఏది ?

ఉ :—మనస్సును ఎప్పుడును అడ్డగించి కట్టివేయుట.

ప్ర :—ఎవడు క్రమమైన (వాస్తవమైన) బ్రహ్మచారి ?

ఉ :—ఊర్ధ్వరేతస్సు గలవాడు.

శ్లో॥ కా చ పరదేవతోక్తా ? చిచ్ఛక్తిః, కో జగద్భర్తా ।
సూర్యః, సర్వేషాం కో జీవనహేతుః, ? స పర్జన్యః॥ 54

ప్ర :—పరదేవత ఎవరు ?

ఉ :—జ్ఞానరూపిణియైన అంబికాదేవి.

ప్ర :—జగత్తునకు భర్త ఎవడు ?

ఉ :—సూర్యుడు. (అన్నము నిచ్చువాడు)

ప్ర :—జీవనమునకు కారణభూత మేది ?

ఉ :—వర్షము.

శ్లో॥ కః శూరో ? యో భీతత్రాతా, త్రాతా చ కః ? స
గురుః । కో హి జగద్గురురుక్తః ? శంభుః, జ్ఞానం కుతః ?
శివాదేవ ॥ 55

ప్ర :—శూరు డెవడు ?
ఉ :—భయమునొందినవానిని రక్షించువాడు.
ప్ర :—రక్షించువా డెవడు ?
ఉ :—సద్గురు.
ప్ర :—జగద్గురు ఎవరు ?
ఉ :—శంభువు.
ప్ర :—జ్ఞానము ఎవనియొద్ద లభించును ?
ఉ :—ఆ శంభువునొద్దనే.

శ్లో॥ ముక్తిం లభేత కస్మాత్ ? ముకుందభక్తేః, ముకుందః
కః! యస్తారయేదవిద్యాం, కా చావిద్యా ? యదా
త్మనోఽస్ఫూర్తిః ॥ 56

ప్ర :— మోక్షము దేనివలన లభించును ?
ఉ :—ముకుంద భక్తివలన
ప్ర :—ముకుందు డెవడు ?
ఉ :—అవిద్యను దాటించువాడు.
ప్ర :—అవిద్యయన నేమి ?
ఉ :—ఆత్మను మఱచియుండుట.

శ్లో॥ కస్య న శోకో ? యః స్యాదక్రోధః, కిం సుఖం ? తుష్టిః
కో రాజా ? రంజనకృత్, కశ్చ శ్వా ? నీచసేవకో యః
స్యాత్ ॥ 57

ప్ర :—ఎవనికి దుఃఖము లేదు ?

ఉ :—కోపము లేనివానికి.

ప్ర :—సుఖము అన నేమి ?

ఉ :—లోపలి నవ్వు. (పండ్లతోడి నవ్వుగాదు)

ప్ర :—రాజు ఎవడు ?

ఉ :—ఇతనికి సమానమైనవాడు లేడు అని చెప్పబడువాడు.

ప్ర :—కుక్క ఎవడు ?

ఉ :—నీచుని సేవించువాడు. (దౌర్భాగ్యుడు)

శ్లో॥ కో మాయీ ? పరమేశః, క ఇంద్రజాలాయతే ?
ప్రపంచోఽయమ్ ।
కః స్వప్ననిభో ? జాగ్రద్వ్యవహారః, సత్యమపి చ
కిం ? బ్రహ్మ ॥ 58

ప్ర :—మాయను అడంచి పరిపాలించువా డెవడు ?

ఉ :—పరమేశ్వరుడు.

ప్ర :—ఇంద్రజాల మెద్ది ?

ఉ :—ప్రపంచము.

ప్ర :—స్వప్నమువలె ఉండునది ఏది ?

ఉ :—జాగ్రదవస్థలో నుండు వ్యవహారము.

ప్ర :—సత్యము ఏది (అన్ని కాలములయందును నశింపకుండునది.)

ఉ :—పరబ్రహ్మము.

శ్లో॥ కిం మిథ్యా, యద్విద్యానాశ్యం, తుచ్ఛం తు ? శశ
విషాణాది ।
కా చానిర్వచనీయా ? మాయా, కిం కల్పితం, ?
ద్వైతమ్ ॥ 59

ప్ర :—మిథ్య ఏది ?
ఉ :—జ్ఞానమువలన నశించునది.
ప్ర :—తుచ్ఛము ఏది ?
ఉ :—శశవిషాణము మున్నగునవి.
ప్ర :—నిజము, అబద్ధము అని చెప్పుటకు సాధ్యముకానిది ఏది ?
ఉ :—మాయ.
ప్ర :—దానిచే కల్పింపబడునది ఏది ?
ఉ :—ద్వైతము.

శ్లో॥ కింపారమార్థికం స్యాత్ ? అద్వైతం, చాజ్ఞతా కుతో ?
అనాదిః ।
వపుషశ్చ పోషకం కిం ? ప్రారబ్ధం, చాన్నదాయి కిం ?
చాయుః ॥ 60

ప్ర :—ఏది పారమార్థికము ?
ఉ :—అద్వైతము.
ప్ర :—అజ్ఞానము దేనివలన కలుగుచున్నది ?
ఉ :—దానికి ఆది లేదు.
ప్ర :—దేహమునకు పోషణమిచ్చునది ఏది ?
ఉ :—ప్రారబ్ధము అను కర్మ.
ప్ర :—అన్నమును ఇచ్చునది ఏది ?
ఉ :—ఆయువు.

శ్లో॥ కో బ్రాహ్మణైరుపాస్యో ? గాయత్ర్యర్కాగ్నిగోచరః
శంభుః। గాయత్ర్యామాదిత్యే చాగ్నౌ శంభౌ చ కిం
ను ? తత్తత్వమ్ ॥ 61

ప్ర :—బ్రాహ్మణుడు ఎవరిని ఉపాసింపవలయును ?

ఉ :—గాయత్రీ, సూర్యమండలము, అగ్ని-వీనిలో గోచరమయిన శంభువును.

ప్ర :—గాయత్రీ, సూర్యుడు, అగ్ని, శంభువు-వీరియొద్ద నుండునది ఏది?

ఉ :—ఆ శివతత్త్వము.

శ్లో॥ ప్రత్యక్షదేవతా కా ? మాతా, పూజ్యో గురుశ్చ కః?
తాతః। కః సర్వదేవతాత్మా ? విద్యాకర్మాన్వితో
విప్రః॥ 62

ప్ర :—ప్రత్యక్షదేవత ఎవరు ?

ఉ :—తల్లి.

ప్ర :—పూజింపవలసిన గురువు ఎవరు ?

ఉ :—తండ్రి.

ప్ర :—సకలదేవస్వరూపి ఎవరు ?

ఉ :—జ్ఞాన కర్మ సిద్ధిగల బ్రాహ్మణుడు.

శ్లో॥ కశ్చ కులక్షయ హేతుః ? సంతాపః సజ్జనేషు యోఽ-
కారి। కేషామమోఘవచనం ? యే చ పునః సత్య
మౌనశమశీలాః ॥ 63

ప్ర :—కులనాశమునకు కారణమేది ?

ఉ :—సాధుజనులహృదయమందు తాపమును కలిగించు కార్యమును చేయుట.

ప్ర :—ఎవని మాట ఫలించును ?

ఉ :—సత్యవ్రతము, మౌనవ్రతము, క్షమ మున్నగునవి గలవాని మాట.

శ్లో॥ కిం జన్మ ? విషయసంగః, కిముత్తరం జన్మ ? పుత్రః స్యాత్ ।
కోఽపరిహార్యో ? మృత్యుః, కుత్ర పదం విన్యసేచ్చ ? దృక్పూతే ॥ 64

ప్ర :—జన్మమునకు కారణం బేది ?

ఉ :—విషయములందు ఆసక్తి.

ప్ర :—తర్వాతి జన్మము ఏది ?

ఉ :—పుత్త్రుడు.

ప్ర :—పరిహారము చేయ నశక్యమైనది ఏది ?

ఉ :—యముడు.

ప్ర :—ఎచ్చోట పాదము నుంచవలయును ?

ఉ :—కంటికి పరిశుద్ధమని తెలిసిన చోట.

శ్లో॥ పాత్రం కిమన్నదానే ? క్షుధితం, కోఽర్చ్యోహి ? భగవదవతారః । కశ్చ భగవాన్ ? మహేశః శంకరనారాయణాత్మైకః ॥ 65

ప్ర :—అన్నదానమునకు పాత్రు డెవడు ?

ఉ :—ఆకలి గలవాడు.

ప్ర :—ఎవరిని అర్చింపవలయును ?

ఉ :—భగవదవతారమును.

ప్ర —భగవంతు డెవడు ?

ఉ :—శంకరుడును, నారాయణుడును అయిన ఒకటే మూర్తి.

శ్లో॥ ఫలమపి భగవద్భక్తేఃకిం,? తల్లోకస్వరూపసాక్షాత్త్వమ్।
మోక్షశ్చ కో? హ్యవిద్యాస్తమయః, కః సర్వవేదభూః? అథ చోమ్ ॥ 66

ప్ర :—భగవద్భక్తికి ఫలం బేది ?

ఉ :—ఆతని లోకసాక్షాత్కారము.

ప్ర :—మోక్షము అన నేమి ?

ఉ :—అవిద్యను నాశము చేయుట.

ప్ర :—సకల వేదములకును ఉత్పత్తియు (లయమును) ఏది ?

ఉ :—ఓమ్.

శ్లో॥ ఇత్యేషా కంఠస్థా ప్రశ్నోత్తరరత్నమాలికా యేషామ్।
తే ముక్తాభరణా ఇవవిమలాశ్చా భాంతి సత్సమాజేషు67

ఈ ప్రశ్నోత్తరరత్నమాలను కంఠమున (మనస్సున) ధరించిన వారలు, ముక్తాభరణములు (ముక్తినొందినవారిలో శ్రేష్ఠులు) వలె, సత్పురుషులు నిండిన సభలయందు ప్రకాశింతురు.

"ప్రశ్నోత్తరరత్నమాలలో 67 శ్లోకములున్నవి. 65 శ్లోకములు మన ఆచార్యులు రచించినట్లు నేను తలంచుచున్నాను. "ఓమ్" అని 66-వ శ్లోకమున చెప్పినదానితో వారు ముగించిరి. మొదటి శ్లోకమును, కడపటి శ్లోకమును భక్తులచే వ్రాయబడినవి. మన ఆచార్యులవారు రచించిన గ్రంథములలో ఇది చాల సులభమైనది. సంస్కృతభాషను చదువు బిడ్డలకు ఇది ఉపయోగకరమై యుండును."

అని శ్రీస్వాములవారు మైలాపూరు క్షేత్రమున ఉపదేశించిరి.

శ్రీ ప్రశ్నోత్తరరత్నమాలిక
సంపూర్ణము.

ఓమ్ తత్ సత్.

శ్రీ గురుపాదార్పణమస్తు.



